నింకను 360 రెట్లు పెంచియుండిరి. వారి యుద్దేశ్యములో నా కాలమువారు వరుసగా 400, 300, 200, 100 సం॥ జీవింతురనియు, ధర్మదేవతగూడ ఆ యుగములలో 4, 3, 2, 1 పాదములమీద నడచుననియు తలంచి యుండిరి. ఇదియే మనుస్మృతిలో జెప్పబడినది. ఇట్లు లెక్కలువేసి సృష్ట్యాదియంతను సరిపుచ్చినను వారికి తెలిసిన పూర్వుల తరములకు సరి పెట్టుటలో కుదరక చిక్కువచ్చినందున అనగా ఆ లెక్కప్రకారముగూడ వారికి పూర్వరాజులపేర్లు చాలనందున అందరికి సమానముగా యుగములు పంచిరి. ప్రతి దేవమహాయుగమునకు ముగ్గురు రాజుల చొప్పున భావించి వైవస్వతమనువునుండి 27 మహాయుగములు జరిగినట్లు గూడ పెంచి చెప్పిరి. దీనికి దృష్టాంతమేమన, మన్నప్రాచీన శాస్త్రములరీత్యాగాని, గణిత శాస్త్రజ్ఞులకు తెలిసినవిగానీ యేడు యుగములే గడచినవి. 8 వది జరుగు చున్నది. వీని ఆరంభాంతములను లోగడ వ్రాసితిమి. ఇవియే మనపంచాంగములలో కనబడుచున్నవి. పూర్వ గణితశాస్త్రములలో నింతవరకే యాద్యంతములు దొరకుచున్నవి. ఇవి మానవ యుగములే యనియు, 1200 కన్న ప్రతియుగమును హెచ్చులేదనియు ఇక్ష్వాకు వంశములోని తరముల సంఖ్యలను బట్టి నిర్ణయించితిమిగదా. వీని ప్రకారము మన పూర్వులు నేటివరకు 7 × 1200=8400 సం॥ల చారిత్రమునే యెరుగుదు రనియు, దర్వాతవచ్చిన యుగము అనగా ప్రస్తుతయుగము 247 సం॥ల క్రిందట ఆరంభమైనట్లును మనకు కనబడుచున్నది. అయితే యిప్పటి పంచాంగ లెక్కప్రకారము కలియుగము 5047 అని చెప్పుచున్నారు. దాని వివరమేమిరో తెలుసుకొందము.

## కలియుగ రహస్యము

మొదటి ఆరుమనువుల కాలము నిజమునకు ఒక యుగమే అయినను అనగా దాదాపు 1200 సం॥లే అయినను వానిని చాల పెంచి చెప్పిరిగదా. దానిని వదలి ఇక్ష్వాకునుండి కృతయుగమని చెప్పబడినందున భారతయుద్ధము తర్వాత 37 సం॥ల వరకు 4 యుగములు అనగా 4800 జరిగియుండెను. అప్పటికి నాల్గవయుగము అంతమైపోవలెను. కాని అప్పటి గణితశాస్త్రజ్ఞు



లగు ఋషిశర్యుల కది యిష్టములేక సృష్ట్యాదిని సరిపుచ్చుటకై మన పూర్వీకులపేరిట మన్వంతరాలు, సప్తర్షులు(Great Pear Stars)మున్నగు వాని పేర్ల శకాల నేర్పరచి అప్పు డమలులో చివరకువచ్చిన కలియుగాన్ని దేవమానముచేసి 1200 దేవమాన సం॥లకు గాని అంతముకానట్లు వ్రాసిరి. అయినను యుగాదుల ఆరంభాంతములను మాత్రము ప్రతి 1200 సం॥లకు గణితశాస్త్రజ్ఞులు మామూలుగా చూపించుచునే వచ్చిరి. ఇది క్రీస్తుశకము దాదాపు 1630 సం॥ల వరకు వేయుచుండిరనవచ్చును. ఏలన, వీరికి తెలిసిన 7 యుగములలో ఒకటి, మొదటి ఆరుమనువులవరకు గల పూర్వులకు వదలకుండా ఇక్ష్వాకు మొదలు భారతయుద్ధమువరకు 4 యుగములును, పోగా మిగతా 3 యుగములు తర్వాతను లెక్కించియుండవచ్చును. అయితే ఇవి యెంతవరకు వచ్చినది నిర్ణయించుటలో ముందుగా భారత యుద్ధకాల నిర్ణయమును, కలికాల నిర్ణయమును, యుగకాలనిర్ణయమును, యుధిష్ఠిర కాల నిర్ణయమును గావించినగాని ధృవపడదు. అందుచే వానిని నిర్ణయించుటకై యిపుడు యత్నింతము. గణితశాస్త్రములలో నిపుడు ముఖ్యమైనదిగా భావింపబడు సూర్యసిద్ధాంతములో ప్రతి దేవమాన యుగారంభమునందును గ్రహము లేడును, మేషరాసియం దుండునని వ్రాసియుండిరి. ఆ ప్రకారము కలియుగారంభమునాడు క్రీస్తుపూర్వము 3102 సం॥ల క్రిందట. ప్రమాది సం॥లో అట్లేయుండెను. అప్పుడొక యుగారంభము జరిగినట్లు చాలమంది విదేశీయ, స్వదేశీయ గణితశాస్త్రజ్ఞు లొప్పుకొనుచున్నారు గాని * పురాణములలో చెప్పినట్లు యీ యుగారంభ మప్పుడే కృష్ణనిర్యాణము, భారత యుద్ధాదులు జరిగెనని చెప్పుటకు వీలుగాలేదు. ఏలన, దీనిలో అనగా నీ యుగారంభమున కృష్ణనిర్యాణము, భారతయుద్ధము జరిగెనని చెప్పెడి పురాణాలన్నింటిలోను పరీక్షిత్తు జన్మము మొదలు అనగా భారతయుద్ధము మొదలు నందాభిషేకపర్యంతము హెచ్చుసంఖ్యనే తీసుకొన్నచో 1500 సం॥లని వ్రాయబడినవి. క్రీస్తుపూర్వము నందులవరకు 422 సం॥లు లెక్క తేలుచున్నది. మొత్తము 1922 సం॥లు అగుచున్నది. అందుచేత క్రీ. పూ.

* కలకత్తా యూనివర్సిటీవారు ప్రచురించిన ఆంగ్లభాషా సూర్యసిద్ధాంతము చూడుడు.